ఓం నమః శివాయ



# ద్వాదశ జ్యోతిర్లింగ దర్శనం

సౌరాష్ట్రదేశే విశదేతిరమ్యే జ్యోతిర్మయం చంద్రకలావతంసం

వేద గ్రంథాలయం 9666122140

భక్తి ప్రదానాయ కృపావతీర్ణం తం సోమనాథం శరణం ప్రప్రద్యే
శ్రీశైల శృంగే విబుధాతిసంగే తులాద్రితుంగే పి
ముదావసంతం
త మర్జునం మల్లిక పూర్వమేకం నమామి సంసార సముద్ర
సేతుం
అవంతికాయం విహితావతారం ముక్తిప్రదానాయ చ
సజ్జనానాం
అకాల మృత్యోః పరిరక్షణార్థం వందే మహాకాల మహాసురేశం
కావెరికా నర్మదయోః పవిత్రే సమాగమే సజ్జనతారణాయ
సదైవ మాంధాతృపురే వసంతమోంకార మీశం శివమేకమీడే
పూర్వోత్తరే ప్రజ్వలికా నిధానే సదా వసంతం గిరిజాసమేతం
సురాసురాధిత పాదపద్మం శ్రీవైద్యనాథం తం మహం
నమామి
యామ్యే సదంగే నగరేతి రమ్యే విభూషి తాంగం వివిధైశ్చభోగైః
సద్భక్తిముక్తి ప్రదమీశ మేకం శ్రీనాగనాథం శరణం ప్రపద్యే
మహాద్రిపార్శ్వే చ తటేరమంతం సంపూజ్యమానం సతతం
మునీంద్రైః
సురాసురైర్యక్ష మహోరగాద్యైః కేదారమీశం శివమేకమీడే
సహ్యాద్రిశీర్షే విమలే వసంతం గోదావరీతీర పవిత్ర దేశే
యద్దర్శనా త్పాతకమాశునాశం ప్రయాతి తం
త్ర్యంబకమీశమీడే
సుతామ్రపర్ణీ జలరాశియోగే నిబధ్యసేతుం విశిఖై రసంఖ్యైః
శ్రీరామచంద్రేణ సమర్పితం తం రామేశ్వరాఖ్యం నియతం
నమామి
యం ఢాకినీ శాకినికా సమాజే నిషేవ్యమాణం పిశితాశనైశ్చ

సద్దైవ భీమాది పద ప్రసిద్ధం తం శంకరం భక్తిహితం నమామి
సానంద మానంద వనే వసంత మానసనందకందం
హతపాపబృందం
వారాణసీనాథ మనాథనాథం శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే
ఇలాపురే రమ్యవిశాలకేస్మిన్ సముల్లసంతం చ జగద్వరేణ్యం
వందే మహోదారతర స్వభావం ఘృష్ణేశ్వరాఖ్యం శరణం
ప్రపద్యే
జ్యోతిర్మయ ద్వాదశాలింగకానాం శివాత్మనాం ప్రోక్తమిదం
క్రమేణ
స్తోత్రం పఠిత్వామనుజోతి భక్త్యాఫ్లం తదాలోక్య నిజం భజేచ్ఛ

జ్యోతిస్వరూపుడైన మహేశుడు ఈ పవిత్ర భారతావనిలో పన్నెండుచోట్ల జ్యోతిర్లింగ స్వరూపంలో వెలసి భక్తులను కరుణిస్తున్నాడు. భారతదేశంలోని నాలుగుదిక్కులలో పన్నెండు జ్యోతిర్లింగాలున్నాయి. సముద్రపు ఒడ్డున రెండు (బంగాళాఖాతతీరంలో రామేశ్వరలింగం, అరేబియా సముద్రతీరాన సోమనాథలింగం) పర్వత శిఖరాలలో నాలుగు (శ్రీశైలంలో మల్లిఖార్జునుడు, హిమాలయాలలో కేదారేశ్వరుడు, సహ్యాద్రి పర్వతాలలో భీమశంకరుడు, మేరుపర్వతాలపై వైద్యనాథలింగం) మైదాన ప్రదేశాలలో మూడు (దారుకావనంలో నాగేశ్వరలింగం, ఔరంగాబాద్ వద్ద ఘృష్ణేశ్వర లింగం, ఉజ్జయినీ నగరంలో మహాకాళేశ్వర లింగం) నదుల ఒడ్డున మూడు (గోదావరీతీరాన త్ర్యంబకేశ్వర

లింగం, నర్మదాతీరానా ఓంకారేశ్వరుడు, గంగానదీతీరాన విశ్వేశ్వరుడు). ఇలా మొత్తం పన్నెండు జ్యోతిర్లింగ రూపాలలోనున్న ఈ లింగాలు పరమశివుని తేజస్సులు. ఇవి ద్వాదశాదిత్యులకు ప్రతీకలు. పదమూడవ లింగం కాలలింగం. తురీయావస్థను పొందిన జీవుడే కాలలింగము. తైత్తీరీయోపనిషత్తుననుసరించి 1. బ్రహ్మ 2. మాయ 3. జీవుడు 4. మనస్సు 5. బుద్ధి 6. చిత్తము 7. అహంకారము 8. పృథ్వి 9. జలము 10.తేజస్సు 11. వాయువు 12. ఆకాశం – ఈ పన్నెండు తత్త్వాలే పన్నెండు జ్యోతిర్లింగాలు. ఇవన్నీ ప్రతీకాత్మకంగా మన శరీరంలో ఉన్నాయి. ఖాట్మండులోని పశుపతినాథలింగం ఈ పన్నెండు జ్యోతిర్లింగాలకు శిరస్సు వంటిది. ఈ జ్యోతిర్లింగాలలో ఒక్కొక్క జ్యోతిర్లింగానికి ఒక్కొక్క మహిమ ఉంది. ద్వాదశ జ్యోతిర్లింగాలను దర్శించినా, స్పృశించినా అనేక మహిమలు మన జీవితాలలో ప్రస్ఫుటమవుతుంటాయి. పన్నెండు జ్యోతిర్లింగాలను దర్శించుకోలేనివారు, కనీసం ఒక్క లింగాన్నైనా దర్శించగలిగితే అనంతకోటి పుణ్యం లభిస్తుందనేది పెద్దలవాక్కు.

1. శ్రీ సోమనాథ జ్యోతిర్లింగం

సౌరాష్ట్రదేశే విశదేతి రమ్యే, జ్యోతిర్మయం చంద్రకలవతంసం

భక్తిప్రదానాయ కృపావతీర్ణం, తం సోమనాథం శరణం ప్రపద్యే

స్వామి సోమనాథునిగా వెలసిన కథ స్కాంద పురాణంలో ఉంది.

బ్రహ్మదేవుని మానసపుత్రుడైన దక్షప్రజాపతికి అశ్విని నుంచి రేవతి వరకు 27 కుమార్తెలున్నారు. తన కుమార్తెలను చంద్రునికి ఇచ్చి ఘనంగ వివాహం జరిపించాడు దక్షుడు. అయితే చంద్రుడు రోహిణిని మాత్రం అనురాగంతో చూస్తూ, మిగిలినవారిని అలక్ష్యం చేయసాగాడు. మిగిలినవారు తండ్రితో ఈ విషయాన్ని మొరపెట్టుకోగా, దక్షుడు అల్లుడైన చంద్రుడిని మందలిస్తాడు. అయినప్పటికీ, చంద్రుని ప్రవర్తనలో మార్పురాకపోవడంతో, క్షయరోగగ్రస్తుడవు కమ్మని చంద్రుని శపిస్తాడు దక్షుడు. ఫలితంగా చంద్రుడు క్షీణించసాగాడు. చంద్రకాంతి లేకపోవడంతో ఔషధాలు, పుష్పాలు ఫలించలేదు. ఈ పరిస్థితిని చూసిన సమస్తలోకవాసులు, తమ కష్టాలు తీరేమార్గం చూపమని బ్రహ్మ దేవుని ప్రార్థించారు. బ్రహ్మ ఆదేశాన్ననుసరించి ప్రభాసక్షేత్రంలో మహామృత్యుంజయ మంత్రానుష్ఠానంగా శంకరుని ఆరాధించిన చంద్రుడు, పార్థివలింగాన్ని ప్రతిష్టించి పూజించగా, శంకరుడు ప్రత్యక్షమై, చంద్రుని రోగ విముక్తుని గావించి, కృష్ణపక్షంలో చంద్రకళలు రోజు రోజుకీ తగ్గుతాయనీ, శుక్లపక్షంలో దిన మొక కళ చొప్పున పెరుగుతుందని అనుగ్రహించాడు. ఆనాటి నుండి చంద్రుని కోరిక మేర, అతని కీర్తిదిశదిశలా వ్యాపించేందుకై చంద్రుని పేరుతో

సోమనాథునిగా, కుష్టు వంటి మహా రోగాలను తగ్గించే సోమనాథ్ జ్యోతిర్లింగరూపునిగా పార్వతీదేవిసమేతంగా వెలసి భక్తులను కరుణిస్తున్నాడు.

2. శ్రీ మల్లిఖార్జున జ్యోతిర్లింగం

శ్రీశైల శృంగే వివిధ ప్రసంగే, శేషాద్రి శృంగేపి సదావసంతం
తమర్జునం మల్లికపూర్వ మేనం, నమామి సంసార
సముద్రసేతుం
శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామి కోపోద్రిక్తుడై తల్లిదండ్రులను వదలి, క్రౌంచపర్వతానికి చేరుకోగా, కుమారుని వదలి ఉండలేని పార్వతీపరమేశ్వరులు ఈ ప్రాంతంలోనే ఆగిపోయారని పురాణ కథనం. అందుకే "శ్రీశైల శిఖరాన్ని దర్శించుకుంటే పునర్జన్మ ఉండద"ని అంటారు. అలాగే పర్వతుడనే ఋషి తపఃఫలంగా పరమశివుడు ఇక్కడ లింగరూపంలో ఆవిర్భవించాడని మరోకథనం.

కాశ్యాంతు మరణాన్ముక్తిః స్మరణా దరుణాచలే
దర్శనాదేవ శ్రీశైలే పునర్జన్మ న విద్యతే

కాశీ క్షేత్రంలో మరణం, అరుణాచలంలో భగవన్నామస్మరణం, శ్రీశైలంలో లింగ దర్శనం ముక్తిదాయకాలు. కృతయుగంలో హిరణ్యకశిపుడు, త్రేతాయుగంలో రావణ సంహారానంతరం

శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగంలో అరణ్యవాసానంతరం పాండవులు, శ్రీశైలానికి వచ్చి భ్రమరాంబ సమేత మల్లిఖార్జునస్వామివారిని దర్శించుకున్నట్లు పురాణ కథనం. సీతారాముల రామసహస్రలింగం, సీతాసహస్రలింగాలను ప్రతిష్టించినట్లు ప్రసిద్ధి. ఈ కలియుగంలో ఆదిశంకరాచార్య, ఆచార్యనాగార్జునుడు, కృష్ణదేవరాయలు, ఛత్రపతి శివాజీ వంటివారెందరో స్వామిని దర్శించుకుని పూజలు జరిపించారు.

3. శ్రీ మహాకాళేశ్వర జ్యోతిర్లింగం

విహితావతారం, ముక్తిప్రదానాయచ సజ్జనానాం
అకాల మృత్యోహ పరిరక్షనార్థం, వందే మహాకాల మహం సురేశం

పరమేశ్వరునికి స్మశానమంటే అత్యంత ఇష్టం. ఈ భూమిపైనున్న సిద్ధక్షేత్రాలలో నైమిశారణ్యం – పుష్కరం – కురుక్షేత్రం ముఖ్యమైనవి. కురుక్షేత్రం కంటే పదిరెట్లు కాశీ పుణ్యప్రదమైనది. కాశీ కంటే మహాకాలవనం పదిరెట్లు గొప్పది. తీర్థాలలో అత్యుత్తమైనది ప్రభాసం – శ్రీశైలం – దారుకావనం. వీటన్నికంటే మహాకాలవనం గొప్పది. ఎందుకంటే, స్మశానం – ఎడారి – పాలంపీఠం – అరణ్యం అంటూ ఐదు ఒకేచోట ఉన్న ప్రదేశం ఉజ్జయిని. పూర్వం

వేదప్రియుడనే శివభక్తునికి దేవ ప్రియుడు, ప్రియమేధుడు, సుకృతుడు, ధర్మవాహి అనే నలుగురుకుమారులుండేవారు. ఈ నలుగురు కూడా శివభక్తులే. ఇదిలా ఉండగా, రత్నమాల పర్వతంపై నివసిస్తున్నా దూషణాసురుడనే రాక్షసుడు, వీరి పూజలకు ఆటంకాన్ని కలిగిస్తూ, అందరినీ హింసిస్తూండేవాడు. ఆ రాక్షసుని బాధలను తట్టుకోలేని అన్నదమ్ములు పార్థివలింగాన్ని ప్రతిష్టించి పూజించాగా, శివుడు మహాకాలుడై ఆవిర్భవించి, దూషణాసురుని,అతని సైన్యాన్ని భస్మం చెసాడు. అప్పట్నుంచి ఉజ్జయినీ నగరంలో విలసిల్లుతున్న మహాకాలేశ్వరుడు త్రిభువన లింగాలలో ప్రసిద్ధునిగా వెలుగొందుతున్నాడు.

4. శ్రీ ఓంకారేశ్వర జ్యోతిర్లింగం

కావేరికా నర్మదయోహ పవిత్రే, సమాగమే సజ్జనతారనాయ సదివ మాదాత్రుపురే వసంత, మొన్కారమీశం శివమేకామీడే ఒకసారి వింధ్యపర్వతం తనకంటే గొప్పవారేవారూ లేరని విర్రవీగుచుండగా, నీకంటే మేరుపర్వతం గొప్పదని నారదమహర్షి చెప్పగా, కుపితుడై, ఓంకార క్షేత్రానికెళ్ళి శివదేవుని పార్థివలింగాన్ని భక్తితోపూజిస్తూ తపస్సు చేసాడు. శివుడు ప్రత్యక్షమై వరాన్ని కోరుకొమ్మనగా, వింధ్యుడు 'స్వకార్యాన్ని సాధించుకునే శక్తిని ప్రాదించమని' వేడుకున్నాడు. శివుడు ఆ వరాన్ని అనుగ్రహించాడు. అప్పుడు సమస్త దేవతలంతా స్వామివారిని ఓంకారేశ్వరంలో

కొలువై ఉండమని ప్రార్థించారు. వారి కోరికను మన్నించిన స్వామి ప్రణవాకారంలో ఓంకారేశ్వరునిగా కొలువైయ్యాడు. ఇదిలా ఉండగా, శివుని నుంచి వరాన్ని పొందిన వింధ్యుడు, వరగర్వంతో ఎంతో ఎత్తుకు పెరిగి సూర్యచంద్రుల గమనానికి కూడా అడ్డుతగలసాగాడు. వింధ్యుని చేష్ట వలన సమస్తలోకాలు అంధకారంలో తల్లడిల్లాయి. అప్పుడు దేవతల మొరలను ఆలకించిన పరమేశ్వరుడు వింధ్యుని గర్వమణచమని అగస్త్యమునిని పురమాయించాడు. అగస్త్యుని రాకను గమనించిన వింధ్యుడు మర్యాద పూర్వకంగా తన ఎత్తును తగ్గించి గౌరవించగా, తాను తిరిగి వచ్చేంతవరకు ఎత్తు పెరగకుండా ఉండమని దక్షిణాదికి వెళ్ళి మరల ఉత్తరాదికి వెళ్ళలేదు అగస్త్యుడు. ఫలితంగా వింధ్యుడు ఎత్తు పెరలేదు.

## 5. శ్రీ వైద్యనాథ జ్యోతిర్లింగం

పూర్వోత్తరే పారలికాభిదానే, సదాశివం తం గిరిజాసమేతం
సురాసురారాదిత పాదపద్మం, శ్రీ వైద్యనాథం సతతం నమామి

వైద్యానాథ జ్యోతిర్లింగ విషయంలో అనేక భేధాభిప్రాయాలున్నాయి. మహారాష్ట్ర పర్లీ గ్రామంలోనిదే అసలైన జ్యోతిర్లింగమని, గంగా ఖేడలోనిలింగం, పంజాబ్ కీరగ్రామం లోని లింగం, హిమాచల్ ప్రదేశ్ లోని పఠాన్ కోట్

కు సమీపంలోని లింగం, కర్ణాటకలోని గోకర్ణ లింగం...ఇవన్నీ శివుని ఆత్మలింగాలేనన్న వాదన బలంగా ఉంది. అయితే జార్ఖండ్ వైద్యనాథంలో వెలసినదే అసలైన జ్యోతిర్లింగమని విజ్ఞుల వాదన. పూర్వం రావణాసురుడు కఠోరనియమాలతో, ఒక చెట్టుకింద అగ్ని గుండాన్ని ఏర్పరచి, పార్థివలింగాన్ని, ప్రతిష్టించి, శివపంచాక్షరీమంత్రంతో, హవన కార్యక్రమంతో నిష్ఠతో ప్రార్థించగా,శివుడు రావణుని కోరికననుసరించి తన ఆత్మలింగాన్ని ప్రసాదించాడు. అయితే ఆ లింగాన్ని భూమికి తాకించిన వెంటనే అక్కడే స్థిరపడుతుందని హెచ్చరించాడు. ఆత్మలింగంతో లంకానగరాంకి తిరుగు ప్రయాణమైన రావణుడు సంధ్యావందనం చేసేందుకు ఒక పశువుల కాపరికి (దేవతల కోరికపై వినాయకుడు ఈ వేషాన్ని ధరించాడు) లింగాన్ని ఇవ్వగా, ఆ కాపరి ఆత్మలింగాన్ని కిందపెడతాడు. ఫలితంగా ఆ లింగం అక్కడే స్థిరపడుతుంది. రవణుడు ఎంతగా ఆత్మలింగాన్ని పెకలించి లంకానగరానికి తీసుకెళదామని ప్రయత్నించినప్పటికీ ఫలితం ఉండదు. వైద్యనాథ్ దేవాలయంలో ఒక విశేషం ఉంది. సాధారణంగా శివాలయ మందిర శిఖరంపై త్రిశూలం ఉంటుంది కానీ, ఈ ఆలయ మందిర శిఖరంపై పంచశూలం ఉంది. మరి ఏ ఇతర జ్యోతిర్లింగ ఆలయాలలో ఇలాంటి అమరిక లేదు. పంచాక్షరీమంత్రంగా కలిగిన పంచముఖ శివునకు పంచప్రాణాలు అంతర్నిహితంగా కలిగిన శివతత్త్వమే ఇందులోని గూఢార్థం.

## 6. శ్రీ నాగేశ్వర జ్యోతిర్లింగం

అమర్తసంజ్ఞే నగరేచ రంయే, విభూశితంగం వివిధైశ్చ భోగైహి
సాధ్భుక్తి ముక్తిప్రదమీశ మేకం, శ్రీ నాగానాతం శరణం ప్రపద్యే

పశ్చిమ సముద్ర తీరాన, దారుకుడనే రాక్షసుడు, 'దారుక' అనే తన భార్యతో కలిసి ప్రజలను చిత్రహింసలు గురిచేయసాగాడు. యజ్ఞయాగాదులను నాశనం చేస్తూ, ముని జనులను హింసించసాగారు. వీరి హింసను తట్టుకోలేని ఋషులు ఔర్వమహర్షికి విన్న వించుకున్నారు. ఔర్వమహర్షి ఆ రాక్షస దంపతులను సతీసమేతంగా మరణించునట్లుగా శపించాడు. ఆ మునిశాపం భూమి పైనే పనిచేస్తుంది. కనుక, రాక్షదంపతులు సముద్రమధ్యంలో నివాసమేర్పరుచుకుని సముద్రయానం చేశేవారిని పీడించసాగారు. ఇలా కనబడిన ప్రయాణీకులందరి ధనవస్తువులను అపహరిస్తూ చెరసాలలో బంధించసాగారు. అలా బంధింపబడినవారిలో సుప్రియుడోకడు. ఇతడు పరమ శివభక్తుడు. రాక్షసబాధలను తట్టుకోలేక సుప్రియుడు ఆర్తనాదం చేయగా, దివ్యతేజః పుంజము కళ్ళు మిరిమిట్లు గొలుపునట్లు ప్రకాశించింది. ఆ కాంతికి దారుకునితోపటు సమస్త రాక్షసులు నేలకొరిగారు. అక్కడ పరమశివుడు నాగరూపమై జ్యోతిర్లింగమైవెలిసాడు. ఈ స్వామికి దర్శించి, సేవించుకున్నవారికి శాశ్వత పుణ్యలోకవాసం సిద్ధిస్తుందని ప్రతీతి.

# 7. శ్రీ కేదారేశ్వర జ్యోతిర్లింగం

మహాద్రిపార్శ్వేచ తటే రామంతం, అమ్యూజ్యమానం సతతం మునీన్ద్రైహి
సురాసురైర్యక్ష మహోరగాద్యైహి కేదారమీశం శివమేకమీడే

ఒకప్పుడు బదరికావనంలోని నరనారాయణులు అరీంత్యంత నిష్ఠాగరిష్ఠులై తపస్సు చేయసాగారు. వారు కేదారక్షేత్రానికెళ్ళి మందాకినిలో స్నానం చేస్తూ, పార్థివలింగాన్ని ప్రతిష్టించి పూజ చేయసాగారు. వారి తపస్సుకు మెచ్చిన పరమశివుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగా, జ్యోతిర్లింగ రూపంలో వెలసి, జనులను గర్భవాసనరకమునుంచి తొలగించి ముక్తిని ప్రసాదించమని ప్రార్థించారు. ఈ క్షేత్రం అత్యంత ప్రాచీనమైనది. నరనారాయణులు, పంచపాండవులు, ఉపమాన్యుమహర్షి, ఆదిశంకరులవారు ఈ దివ్య క్షేత్రాన్ని దర్శించుకున్నట్లు ఆధారాలున్నాయి. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఏడవదిగా ప్రసిద్ధి పొందిన ఈ కేదారేశ్వరలింగం హిమాలయాలపై సముద్రమట్టానికి 11,760 అడుగుల ఎత్తులో ఉంది. కేదారేశ్వర జ్యోతిర్లింగం లింగాకారంగాకాక పట్టక రూపంలో ఉంటుంది. స్వామిని భక్తులు తాకి అభిషేకాలు చేస్తుంటారు. వైశాఖ శుద్ధ పాడ్యమి మొదలు ఆశ్వయుజ బహుళ చతుర్దశి వరకు ఆరుమాసాలు

మాత్రమే ఆలయ తెరచి ఉంటుంది. దీపావళి రోజునస్వామికి నేటితోవెలిగించిన దివ్యజ్యోతి ఆరుమాసాల తరువాత తెరచినప్పటికీ వెలుగుతూకనిపిస్తుంది. ఆరునెలల పాటూ ఆలయం మూసి ఉన్న సమయంలో కొండదిగువన ఉర్విమఠంలో స్వామి కొలుపై  భక్తులకు దర్శన మిస్తుంటాడు. ఇక్కడ స్వామి అర్చనకై బిల్వ దళాలు దొరకనందున రుద్రప్రయాగ నుండి బ్రహ్మకమలాలను తెప్పించి పూజ చేస్తారు. ఇక్కడ అమ్మవారైన కేదారగౌరి ఆలయానికి దక్షిణం వైపు సింహద్వారముంది. ఆలయ సభామంటపంలో నంది, పాండవులు, ద్రౌపది, కుంతి, శ్రీకృష్ణ భగవానుని విగ్రహాలున్నాయి. దేవాలయం పైభాగంలో కనిపించే మూడు శిఖరాలు త్రిశూలాన్ని తలపిస్తాయి. దేవాలయానికి ఎనిమిది దిక్కులలో రేతకుండం, శివకుండం, భృగుకుండం, రక్తకుండం, వహ్ని కుండం, బ్రహ్మతీర్థం, హంసకుండం, ఉదకకుండం అంటూ అష్టతీర్థాలున్నాయి. స్వామికి అభిషేకం చేసేందుకు ఇక్కడ గంగనీరు దొరకదు. కాబట్టి, భక్తులు హరిద్వార్, రుద్రప్రయాగ వంటి చోట్ల నుండి సీసాలలో గంగను పట్టుకెళ్ళి స్వామికి అభిషేకం చేయిస్తుంటారు.

## 8. శ్రీ త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగం

సింహాద్రి పార్శ్వేషి తటే ర మంతం , గోదావరీ తీర పవిత్ర దేశే

యద్దర్శనాత్పాతక జాతనాశః , ప్రజాయతే త్రయంబక మీశమీడే

ఈ క్షేత్రాన్ని త్రిసంధ్యాక్షేత్రమని కూడా పిలుస్తుంటారు. త్ర్యంబకేశ్వరుడు స్వయంభువుడు. అమ్మవారు త్ర్యంబకేశ్వరి. స్వామివారి ఆకృతి విచిత్రంగా ఉంటుంది. ఇక్కడ పానవట్టం మధ్యలో లింగం ఉండదు. ఆ స్థానంలో రుబ్బురోలు లోపలిభాగంవలె గుంటతో లోతుగా ఉంటుంది. పరమశివుడు తిమూర్త్యాత్మకంగా, త్రిగుణాత్మకమన్నట్లు మూడు భాగాలుగా ఉంటుంది. వనవాసంలోనున్న శ్రీరామచంద్రులవారు సీతా, లక్ష్మణ సమేతంగా పంచవటిలో పర్ణశాలను నిర్మించుకుని ఉంటుండగా, లంకేశ్వరుని సోదరి శూర్పణక శ్రీరాముని కామించాగా, అందుకు తగిన ప్రాయశ్చిత్తంగా లక్ష్మణుడు ఆమె ముక్కుచెవులను కోసి, ఇంటిదారి పట్టించాడు. శూర్పణఖ ముక్కు (నాసిక) కోసిన ప్రాంతమే నేడు 'నాసిక్'గా పిలువబడుతోంది. ఇక్కడే గోదావరి పుట్టింది. ఇక్కడ బ్రహ్మగిరి అనే పర్వతం ఉంది. ఈ పర్వత శిఖరాగ్రాన గౌతమమహర్షి అహల్యసమేతంగా తపస్సు చేస్తున్న సమయం. జనహితం కోరి, గౌతమ ముని ద్వారా దివి నుంచి గంగను భూమికి రప్పించాలని నిర్ణయించిన మునులు అందుకు తగిన పథకాన్ని రచించారు. గౌతమమహర్షి తన ఆశ్రమంలో వరిపైరును సాగుచేస్తున్నాడు. ఆ వరి పైరు పైకి దర్భతో సృష్టించిన ఆవుదూడలను పంపించారు ఆ మునులు. తపస్సులో నున్న గౌతమ మహర్షి ఒక దర్భతో వాటిని తోలగా, దర్భ

తాకినంతనే అవి చనిపోయాయి. మునుల పన్నాగం ఫలించింది. గోహత్యాపాతకం నుంచి బయటపడాలంటే గంగను భూమికి రప్పించి, ప్రాయశ్చిత్తంగా స్నానం చేయమన్నారు.  వెయ్యేళ్ళు శివుని ప్రార్థించి గంగను భూమికి రప్పించాడు గౌతమ మహర్షి. గౌతమ మునీంద్రుల తపస్సువలన భూమికి తీసుకురాబడి నందున కారణంగా 'గౌతమీనది' అని, గోవు ప్రాణం వదిలిన ప్రదేశం నుంచి ప్రవహించిన కారణంగా 'గోదావరి' అని ప్రఖ్యాతి చెందింది. ఈ పుణ్య గోదావరీ నది దీనజనోద్ధరణ నిమిత్తమై దారణా, ప్రవరా, అజంతా, ఎల్లోరా గుహలను దాటుకుంటూ ప్రాణహిత, చంద్రావతీ, శబరిప్రాంతాలలో ప్రవహిస్తూ, దక్షిణ వాహినిగా మారి సుమారు 900 కి.మీ. ప్రయాణం చేసి మహరాష్ట్రంలో కోటిపల్లి దగ్గర సాగరుని చేరుకుంటుంది. గౌతమీనది పుట్టిన త్ర్యంబకంలో స్వయంభువునిగా వెలసిన స్వామి, భక్తులను తన కరుణాపూరిత దృక్కులతో కాపాడుతున్నాడు.

9. శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగం

శ్రీ తామ్రామపర్ణీ జలరాశియోగే, నిబధ్యసేతుం నిషి బిల్వపత్రైహి
శ్రీ రామచంద్రేన సమర్చితం , తం రామేశ్వరాఖ్యం సతతం నామామి

రావణాసురుని వధించిన శ్రీరామచంద్రుడు సీత,లక్ష్మణ హనుమత్సమేతంగా పుష్పక విమానంలో అయోధ్యానగరానికి తిరిగి వస్తూ, గంధమాదవ పర్వతంపై కాసేపు విమానాన్ని ఆపాడు. అక్కడున్న మునివరులను బ్రహ్మవంశానికి చెందిన రావణుని చంపిన పాపాన్నుండి బయటపడే మార్గాన్ని చెప్పమని అడుగుతాడు. అప్పుడు ఆ మహర్షులు, శివలింగాన్ని ప్రతిష్టించి, పూజించడం కంటే ఉత్తమమైన మార్గం లేదని చెబుతారు. శ్రీరాముడు శివలింగాన్నొకటి తీసుకురమ్మని హనుమను పురమాయించగా, శివలింగాన్ని తెచ్చేందుకు కైలాసానికి బయలుదేరుతాడు ఆంజనేయుడు. అయితే శివలింగాన్ని ప్రతిష్టించేందుకు ముహూర్తం సమీస్తున్న కొలదీ హనుమ రాక ఆలస్యమైంది. వేరే మార్గం లేక మునివరుల సలహానుసరించి సీతచే సైకత లింగాన్ని (ఇసుకలింగాన్ని) ప్రతిష్టింపజేస్తాడు శ్రీరాముడు. ఈలోపు కైలాసం నుంచి శివలింగంతో తిరిగి వచ్చిన హనుమంతుడు, శివలింగ ప్రతిష్ట జరిగిందని తెలుసుకొని పరిపరి విధాలుగా చింతిస్తాడు. ఆంజనేయుని బాధను గమనించిన శ్రీరాముడు సైకతలింగాన్ని తొలగించి, రాజతాచలంనుంచి తను తీసుకువచ్చిన లింగాన్ని ప్రతిష్టంచమని చెబుతాడు. రాముని మాటలను విన్న ఆంజనేయుడు ఉత్సాహముతో ఇసుకలింగాన్ని తొలగించడానికి ఎన్నో విధాలుగా ప్రయత్నించి విఫలుడవుతాడు. చివరకు తోకతో లింగాన్ని పెకిలించడానికి ప్రయత్నిస్తాడు. ఆంజనేయుని అవస్థలను

గమనించిన శ్రీరామచంద్రుడు, సుమూహూర్త బలం, మంత్రబలం సైకత లింగానికి మహత్యాన్ని కలిగించాయని, కాబట్టి కైలాసం నుంచి తీసుకువచ్చిన లింగాన్ని సైకత లింగం పక్కన ప్రతిష్టించమని చెప్పాడు. అలా శ్రీరాముడు ప్రతిష్టించిన లింగం రామేశ్వరలింగమని, హనుమంతుడు ప్రతిష్టించిన లింగం హనుమదీశ్వరలింగమని పూజలందుకొంటున్నాయి. రామేశ్వరలింగాన్ని పూజించినవారికి బ్రహ్మహత్యాది దోషాలు తొలగిపోతాయి. కాశీయాత్ర చేసినవారు గంగాజలంతో రామేశ్వరలింగాన్ని అభిషేకిస్తే ఈశ్వరానుగ్రహం కలుగు తుందని ఋషివాక్కు, సమస్త ఐశ్వర్యసిద్ధి కలుగుతుంది.

## 10. శ్రీ భీమశంకర జ్యోతిర్లింగం

యో డాకిని శాకినికా సమాజే, నిషేవ్యమానం పిశితాశానైశ్చ సద్దైవ భీమాది పద ప్రసిద్ధం, తం శంకరం భక్తహితం నామామి

త్రేతాయుగంలో భీమాసురుడనే రాక్షసుడు సహ్యాద్రిపై తల్లి కర్కటితో కలిసి జీవిస్తూ, ప్రజలను పీడిస్తూండేవాడు. కర్కటి, పుష్కసి – కర్కటుల కూతురు. లేక లేక పుట్టిన కూతుర్ని అత్యంత గారాబంగా పెంచసాగారు ఆ రాక్షసదంపతులు. యుక్తవయస్కురాలైన కర్కటిని విరాధునికి ఇచ్చి పెండ్లి

చెసారు. ఆ విరాధుడు, శ్రీరామునిటొ జరిగిన యుద్ధంలో మరణించగా, మరలా కర్కటి తల్లిదండ్రులను ఆశ్రయించింది. ఒకరోజు అగస్త్యుని శిష్యుడైన సుతీక్షణుడు భీమానదిలో స్నానం చేస్తుండగా, కర్కటి తల్లిదండ్రులు అతనిని కబళీంచేందుకు ప్రయత్నించి, అ ముని శాపానికి గురై భస్మమయ్యారు. తల్లిదండ్రులను కోల్పోయిన కర్కటి అనాథగా ఆ మిగిలింది. అనాథగా సహ్యాపర్వతంపై తిరుగుతున్న కర్కటిని చూసి, మోహావేశుడైన రావణుని సోదరుడు కుంభకర్ణుడు, ఆమెను బలాత్కరించి, లంకా నగరానికి వెళ్ళిపోయాడు. ఫలితంగా కర్కటి గర్భవతై భీమాసురునికి జన్మనిచ్చింది. తన తల్లి కథను విన్న భీమాసురుడు, దీనంతాటికి కారకుడు రామావతారం ధరించిన విష్ణువేనని, విష్ణువుపై తన పగను తీర్చుకోవాలని, వేయి సంవత్సరాలపాటు బ్రహ్మ గురించి తపస్సుచేసి వరాలను పొందాడు. ఎల్లలోకవాసులను గడగడలాడించిన భీమాసురుడు కామరూప దేశాధిపతి సుదక్షిణుని ఓడించి కారాగృహంలో బంధించాడు.అతని భార్య సుదక్షిణాదేవిని కూడ బంధిస్తాడు. కారాగారంలో సంకెళ్ళతో బంధింపబడినప్పటికీ ఆ దంపతులు, మానస గంగాస్నానం చేస్తూ, ఇసుకలింగాన్ని చేసి ఆరాద్ హించసాగారు. వారి పూజలను చూసిన భీమాసురుడు ఈ లింగం మిమ్ముల‌ను రక్షిస్తుందా అంటూ తన కరవాలాన్ని విసురుతాడు. రాక్షసుని కత్తి పార్థివలింగాన్ని తాకినంతనే కోటి సూర్యప్రభలతో స్వామి జ్యోతిర్లింగంగా ఆవిర్భవించి, త్రిశూలంతో రాక్షస సంహారం గావించాడు. సకలలోకవాసులు

సంతోషించారు. అప్పట్నుంచి స్వామి లోకకళ్యాణార్థం అక్కడనే ఉంటూ భక్తజనా వళిని కరుణిస్తున్నాడు. ఎందరో భక్తుల కోరికలను ఈడేరుస్తున్నాడు.

## 11. శ్రీ విశ్వేశ్వర జ్యోతిర్లింగం

సానంద మానంధవనే వసంత , మానంధకంధం హతపాప బృందం
వారానసీనాథ మనాతనాతం, శ్రీ విశ్వనాథం శరణం ప్రపద్యే

ఈ సృష్టికి ముందునుంచే కాశీపురం పరమ పవిత్రమై విరాజిల్లుతోంది. ఇక్కడ పరమశివుడు సగుణరూపాన్ని ధరించాడు. ఆ స్వరూపం శివశక్తి సమ్మేళనం. స్త్రీ, పురుష రూపాలకు భిన్నంగా ఉన్న ఆ రూపం ప్రకృతి,పురుషులు ఉదయించారు. పరమాత్మ తన నుండి తేజాన్ని వెలువరించి ఐదుక్రోసులమేరగల ఒక మహాపట్టణాన్ని ప్రకృతి పురుషులు తపస్సు చేయడానికి నిర్మించారు. అదే కాశి పట్టణం. పరమాత్మ అదేశానుసారం పురుషుడు సృష్టి నిర్మాణ సామార్థ్యాన్ని పొందేందుకు ఘోర తపస్సు చేసాడు. పరమపురుషుడైన శ్రీమహావిష్ణువు తపస్సు చేస్తుండగా, ఆ తపస్సు వేడికి అతని శరీరం నుండి నీరు కాలువలై ప్రవహించసాగాయి. ఆ జల ప్రదేశాన్ని చూసి ఆది నారాయణుడు ఆశ్చర్యచకితుడై తల ఊపాడు. ఆ ఊపుకు

మణులతో కూడిన చెవి కమ్మ ఊడి ఒకచోట పడింది. ఆ చెవి పోగు ఊడి పడిన స్థలమే 'మణికర్ణి'గా ప్రసిద్ధమైంది. అనంతమైన జలరాశినుండి కాశీపట్టణాన్ని పరమశివుడు తన శూలాగ్రంతో ధరించి కాపాడాడు. జాలం పైభాగంలో యోగనిద్రాపరవశుడైయున్న నారాయణుని నాభికమలం నుండి బ్రహ్మ ఉదయించి, శివాజ్ఞను అనుసరించి సృష్టి చేయడానికి ఉద్యుక్తుడయ్యాడు. ముందుగా బ్రహ్మ పంచాశత్కోటి యోజన పరిమితమగు బ్రహ్మాండాన్ని సృజించి, నాలుగు వైపులా పద్నాలుగు భువనాలను నిర్మించాడు. ఆ బ్రహ్మాండం మజ్జిగలో వెన్నముద్ద వలె తేలియాడసాగింది. ఐరావతాదులతో బ్రహ్మాండం సుస్థిరంగా నిలిచి ఉంది. ఈ బ్రహ్మాండంలో సగం మధ్య భాగం, మిగిలిన సగభాగంలో సగం ఊర్ధ్వభాగం, ఇక మిగిలిఉన్న పాతికభాగం అథోలోకమని చెప్పబడుతోంది. అప్పుడు దేవతలంతా పరమశివుని ప్రార్థించి, భూలోక వాసులను కాపాడేందుకు ఇక్కడే శాశ్వతంగా ఉండమని విన్నవించుకున్నారు. వారి మొరలను ఆలించిన పరమశివుడు విశ్వేశ్వరనామంతో జ్యోతిర్లింగమై కాశీ పట్టణంలో వెలసి భక్తులను అనుగ్రహిస్తున్నాడు. ఈ క్షేత్రపాలకుడు కాలభైరవుడు, అష్టభైరవులు, ఢుండితో సహా 56 గణపతులు, నవదుర్గలు కాశీలో కొలువై ఉన్నారు. కాశీలో ంగ్గంగాస్నానం చేసి, విశ్వేశ్వరుని, భిందు మాధవుని, డుండిగణపతిని, దండపాణిని, కాలభైరవుని, కుమారస్వామిని, అన్నపూర్ణను సేవించుకోవాలి. కాశీయాత్ర చేయలేనివారు, కాశీ పేరును తలచుకుంటే చాలు, యాత్రాపుణ్యఫలం దక్కుతుంది. కాశీలో

మరణించిన వారికి కుడిచెవిలో శ్రీరామ తారక మంత్రోపదేశం లభించి మొక్షం సిద్ధిస్తుంది. రామేశ్వరం నుంచి ఇసుకను తీసుకొచ్చి కాశీ విశ్వేశ్వరుని అభిషేకిస్తే, ఎంతో పుణ్యం కలుగుతుంది. ఇక్కడ గంగాస్నానం చేసిన వారికి ముక్తి, అన్నపూర్ణాదేవిని పూజించినవారికి భుక్తికి లోటుండదు.

12. శ్రీ ఘృష్ణేశ్వర జ్యోతిర్లింగం

ఇలాపురే రమ్య విశాల కేస్మిన్, సముల్లాసం తంచ జగద్వరేణ్యం
వందే మహోదార తర స్వభావం, గ్రిశ్నేశ్వరాఖ్యం శరణం ప్రప్రద్యే.

పూర్వం సమీపంలో సుధర్ముడు – సుదేహా అనే దంపతులుండేవారు. వీరికి ఎంతకాలమైనప్పటికి సంతానభాగ్యం కలుగలేదు. ఒకరోజు ఆ ఇంటికి బ్రహ్మతేజోవిరాజితుడైన ఓ యతీశ్వరుడు భిక్ష కోసం వచ్చాడు. అతనిని సాదరంగా ఆహ్వానించిన దంపతులు ఆ యతీశ్వరునికి భోజన సదుపాయాలను ఏర్పాటు చేశారు. భోజనం చేస్తున్న సమయంలో ఆ దంపతులకు సంతాన భాగ్యం లేదన్న విషయాన్ని తెలుసుకున్న యతీశ్వరుడు, సగంలోనే భోజనాన్ని వదిలెసి వెళ్ళసాగాడు.

సంతానంలేనివారి ఇంట్లో భోజనం చేయకూడదన్నది యతీశ్వరుని నియమం. ఆ దంపతలు యతీశ్వరుని కాళ్ళపై బడి ప్రార్థించగా, త్వరలోనే సంతాన భాగ్యం కలుగుతుందని దీవించాడు. పెళ్ళికి ముందు సుదేహ జాతక చక్రాన్ని పరశీలించిన పండితులు, ఆమెకు సంతానప్రాప్తి లేదని చెబుతారు. ఆ విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్న సుదేహ, తన చెల్లెలు ఘుశ్మకు పెళ్ళి చేసుకోమని భర్తకు చెబుతుంది. సుధర్ముడు ఒప్పుకోకపోయినప్పటికి, సుదేహ పట్టుబట్టి భర్తకు రెండవ పెళ్ళి జరిపిస్తుంది. అలా కొంతకాలం సుఖంగా ఉన్నారు. పరమపతివ్రతయైన ఘుశ్మ, అక్క సుదేహను తల్లిల్లా, భర్త్నను దైవసమానునిగా భావించి సేవిస్తుండెది. అచిరకాలంలోనే ఘుశ్మ గర్భవతి అయింది. ఒక శుభదినంలో ఘుశ్మ మగబిడ్డను ప్రసవించింది. ఆ పిల్లవాడు దినదినప్రవర్ధమానంగా పెరగసాగడు. అయితే, సుదేహ మనసులో అసూయాజ్వాలలు రేగాయి. తన చెల్లెలు, చెల్లెలి కొడుకుపై ఈర్ష్యాద్వేషాలు పెంచుకోసాగిది. ఒకరోజు రాత్రి సుదేఅ, పసివాని గొతుకోసి, తలను మొండేన్ని వేరువేరుగ చెరువులోకి విసిరివేసింది. ఇదంతా తెలియని ఘుశ్మ ఉదయాన్నే లేచి, కాలకృత్యాలను తీర్చుకుని, స్నానం చేసేందుకు సరోవరానికి వెళ్ళింది. అక్కడ ఆమె కుమారుడు తల్లి పాదాల దగ్గరకు ఈదుకుంటువచ్చి,

"సప్త జన్మల పాపం నశించి సన్మార్గ వర్తనలు కావడని కీస్తోత్రం అత్యంత ఫలప్రదాయమైనదనీ - కేవలం స్మరణ

మాత్రాన సంకల్ప సిద్ధి కలుగుతుందనీ వివరించారు మన పూర్వీకులు.

" ఓం సౌరాష్ట్రే సోమనాధం చ !

శ్రీ శైలే మల్లికార్జునం !!

ఉజ్జయిన్యాం మహాకాళం !

ఓంకారే పరమేశ్వరం !!

కేదారం హిమవతః పృష్ఠే !

ఢాకిన్యాం భీమశంకరం !!

వారణాస్యాం తు విశ్వేశం !

త్ర్యంబకం గౌతమీతటే !!

వైద్యనాధం చితాభూమౌ !

నాగేశం దారుకావనే !!

సేతుబంధే చ రామేశం !

ఘుశ్మేశం చ శివాలయే !!"

మునులంతా ఆయనతో శృతి కలిపారు. అనంతరం

ఆయా స్థలాల విశేషాలు చెప్పమని శౌనకాది మునివరేణ్యులు కోరగా సూతుడు ఇలా చెప్పసాగాడు.

1. సౌరాష్ట్ర:

"ఈ పన్నెండు జ్యోతిర్లింగాలలో మొదటిది ప్రభాసక్షేత్రంలో ఉన్న సోమనాథ స్వామి. (సోమనాథ లింగం)

దక్ష ప్రజాపతి తన 27 గురు పుత్రికలను (అశ్విని, భరణి మొ|| 27 నక్షత్రాలు వీరే) చంద్రునకిచ్చి పెళ్లి చేశాడు. కాని చంద్రుడు ఒక్క రోహిణి యందు మాత్రం ఎక్కువ ప్రేమకలిగి, మిగతా వారిని సరిగ్గా చూడకపోగా వారంతా తమ తండ్రితో చెప్పుకున్నారు.

అది సహించని దక్షుడు, చంద్రుని క్షయ వ్యాధిగ్రస్తుడై పోవాలని శపించాడు. బ్రహ్మదేవుని సూచనమేరకు, చంద్రుడు ఈ ప్రభాస తీర్థానగల శివలింగాన్ని అర్చించి రోగ విముక్తుడైనాడు. సోముడు అనగా చంద్రుడు. లింగరూపుడై ఇక్కడ వెలసిన శివుని ఆరాధించాడు కనుక దీనికి సోమనాథ క్షేత్రం అని పేరు వచ్చింది.(ప్రస్తుతం ఇక్కడ వున్న

సోమనాథ మందిరంలోని గర్భగుడి క్రింద ఉన్న గుహాలో - ఆనాటి చంద్రార్చిత శివలింగాన్ని చూడగలం!)

2. శ్రీశైలం:

ఆంధ్రదేశమందున్నదీ శ్రీశైల క్షేత్రం. శ్రీ భ్రమరాంబా సమేత మల్లికార్జున స్వామిగా కొలువై ఉన్న స్వామివారు సాక్షిగణపతి సహితుడు కూడ!

క్రౌంచ పర్వతం వీడి అలిగి వెళ్లిపోయిన తమ కుమారుని షణ్ముఖుని వెతుకుతూ ఇక్కడ జ్యోతిర్లింగ రూపుడై వెలశాడు. 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే' అని ఇక్కడ శ్రీశైల శిఖర దర్శనం చేసిన వారికి పునర్జన్మ అనేది ఉండదని శ్రుతి.

3. ఉజ్జయిని:

శిప్రా నదీ తీరంలోని (మాళవ) ఉజ్జయినీ నగరంలో మహా కాళేశ్వర లింగం మూడవది.

ఉజ్జయిని రాజు చంద్రసేనుడు శివార్చనపరుడై ఉండడం చూసి, శ్రీకరుడనే గోపబాలకుడు ఆ విధానం శ్రద్ధగా పరికించి తానూ ఒకరాతిని తెచ్చి అట్లే పూజించసాగాడు. ఇంట్లో వాళ్లు అతని పూజకు ఆటంకం కల్పిస్తున్న కొద్దీ అతడిలో భక్తి

తత్పరత అధికం కాసాగింది. చివరకు స్వామి ఆ రాతిలోనే స్థిరపడ్డాడు.

సంధ్యా సమయంలో ఈ కాళేశ్వర లింగాన్ని దర్శించడం విశేష ఫలప్రదం.

4. అమలేశ్వరం:

మాళవ దేశంలోని నర్మదాతీరంలో ఉన్న ఈ జ్యోతిర్లింగం, ఈ క్రమంలో నాలుగవది.

పర్వతాలన్నిటిలోకెల్లా తానే గొప్ప పర్వతాన్నని అహంకారంతో వింధ్యపర్వతం విర్రవీగుతూండగా, అట్టి వింధ్యుడికి - అహంకారం అణచడానికి నారదుడు నడుం కట్టాడు.

పర్వతాల్లో కెల్లా మేరువే గొప్పవాడని - అతడికి దైవత్వం ఉందనీ నారదుడు చెప్పడంతో, తానూ దైవత్వం సాధించాలని వింధ్యుడు నర్మదా నదీ తీరాన అమలేశ్వరంలో పార్థివ లింగారాధన చేసి, పరమేశ్వరానుగ్రహానికి పాత్రుడయ్యాడు. దేవతల కోరిక మేరకు జ్యోతిర్లింగ రూపుడై పరమశివుడు ఓంకార మూర్తిగా వెలశాడు.

5. కేదారం:

హిమాలయ పర్వత శ్రేణులలో, ఒక కొండ కొనకొమ్ము ఆకృతిలో సదాశివుడు కేదారనాధుడిగా అవతరించడానికి నరనారాయణులనే మునివర్యులే కారకులు. వారి ఉగ్రతపోదీక్షకు మెచ్చిన శివుడు ఇక్కడ జ్యోతిర్లింగ రూపుడైనాడు.

6. ఢాకిని:

సంపూర్ణ శివభక్తులైన సుదక్షిణ - కామరూపుల జంట సంరక్షణార్థం పార్వతీపతి జ్యోతిర్లింగ రూపుడై సహ్యాద్రి కనుమలలో భీమనదీ ఉత్తర దిశాతీరాన భీమశంకర జ్యోతిర్లింగంగా (త్రిపురాసుర సంహారము తర్వత) వెలసిన తావు ఢాకిని, ఇక్కడ విహారానికి వచ్చి, ఈ ప్రాంతపు నైర్మల్యానికి ముచ్చటపడి లింగరూపుడైనాడు.

సర్వసంకటహరుడుగా, భీమేశ్వర లింగానికున్న ఖ్యాతి అనంతం.

7. వారణాశి:

మహా క్షేత్ర తీర్థరాజమై, సర్వ విద్యాధామమై విరాజిల్లే (అవిముక్తం) ముక్తి క్షేత్రమైన వారణాశి లేదా కాశీ సాంబశివునికి అత్యంత ప్రీతి పాత్రమైన ప్రదేశం.

ప్రళయకాలంలో కూడా - ఈ క్షేత్రాన్ని విశ్వేశ్వరుడు లయం నుండి మినహాయింపు ఇచ్చినట్లు ప్రతీతి.

స్వామి లింగరూపుడై ఇచ్చట వెలసి, సదా సుప్రసన్నంగా సర్వ సేవ్యంగా ఉంటాడు. అన్నపూర్ణ - ఢుండి వినాయక బిందుమాధవ సహితుడైనట్టి ఈ ప్రదేశానికి 'కాశ్యాంతు మరణాన్ముక్తిః' అని ఇక్కడ మరణించేవారికి ముక్తి కలుగుతుందని శాస్త్ర వచనం.

శ్రీహరి తపస్సు చేసిన విశేషస్థలి కూడ.

8. త్రయంబకం:

బ్రహ్మగిరిపై గౌతమ మహర్షి తపస్సుకు అనుగ్రహించి, నాసికవద్ద తన జటాజూటం నుండి గోదావరి నదిని ప్రవహింపజేసి అనుగ్రహించిన పరమేశ్వరుడు ఈ నదీ తీరాన త్రయంబకేశ్వరుడనే జ్యోతిర్లింగంగా వెలిశాడు.

9. వైద్యనాదం:

రావణాసురుని అనుగ్రహించిన శివుడు, తానే స్వయంగా ప్రసాదించిన లింగం ఎక్కడా క్రిందపెట్టకుండా పూర్తిగా చేతులతో మాత్రమే తీసుకెళ్లాలని ఆంక్షపెట్టి మరీ ఇచ్చాడు. ఎక్కడ దానిని భూమిపై ఉంచితే అక్కడ ప్రతిష్ఠాపన అయిపోగలదన్నాడు.

తన లంకానగరిలో ప్రతిష్ఠించాలన్న తాపత్రయంతో దాన్ని పొందివున్నాడు రావణుడు.

వింధ్య పర్వతాల దగ్గర కొచ్చేసరికి, కారణాంతరాల వల్ల లింగాన్ని చేతుల్లోంచి దించవలసివచ్చి, సమీపంలోనే ఉన్న ఓ గొల్లపిల్ల వాడిని పిలిచి తాను వచ్చి తీసుకొనేదాకా ఆ లింగం చేతుల్లోనే ఉంచవలసిందని కోరాడు. ఈలోగా దేవతల ప్రేరణచే, ఆ గొల్లడు రావణుడు రాకుండానే దాన్ని నేలన పెట్టేశాడు.

ఇంకేముందీ? అది అక్కడే ప్రతిష్ఠితం అయిపోయింది. పర్లి అనే ప్రాంతంలో ఈ జ్యోతిర్లింగ ప్రతిష్ఠకు గొల్లని రూపంలో శ్రీకృష్ణుడే కారకుడని ఐతిహ్యం. ప్రత్యక్షంగా రోగనివారకుడై వైద్యనాధస్వామిగా అనుగ్రహిస్తున్నాడిక్కడ.

10. ద్వారక:

నాగనాధుడు లేక నాగేశ్వరుడుగా ద్వారకా పట్టణాన విరాజిల్లు తున్న పరమేశ్వర జ్యోతిర్లింగం పదవది.

దారుకుడనే రాక్షసుడి బారినుండి సుప్రియుడు అనే మహాశివార్చనాపరుని రక్షించి జ్యోతిర్లింగంగా ఆవిర్భవించాడు ఇక్కడ. ఈ లింగార్చన వల్ల చక్రవర్తిత్వం సిద్ధిస్తుందని నలచక్రవర్తి నిరూపించాడు.

11. రామేశ్వరం :

త్రేతాయుగంలో రాముడు, రావణవధ అనంతరం, సేతుబంధనం చేసిన ప్రాంతంలో శివార్చన చేసి, జ్యోతిర్లింగ రూపంలో అక్కడే స్థిరుడిగా ఉండమని కోరగా పరమేశ్వరుడు అనుగ్రహించాడు.

12. దేవగిరి:

దక్షిణాదిన దేవగిరి పర్వత సమీపంలో ఘుశ్మ అనే మహా భక్తురాలి కోరికపై ఘుశ్మేశ్వర లింగరూపుడైనాడా మహేశ్వరుడు".

..అని అయా జ్యోతిర్లింగాల విశేషాలను చెప్పిన సూతుడు, మరోసారి ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రం చేసి, స్తోత్రపఠన ఫలితాన్ని ఈ విధంగా ఎరింగించాడు -

శ్లో. ద్వాద శైతాని నామాని - ప్రాతరుత్థాయ యః పఠేత్

సర్వ పాప వినిర్ముక్తం - సర్వసిద్ధిప్రదం లభేత్ ||

యం యం కామ మపేక్ష్యైవ - పఠిష్యంతి నరోత్తమాః

ప్రాప్స్యంతి కామం తం తం హి - పరత్రేహ మునీశ్వరాః ||

ఏతేషాం పూజనే నైవ - వర్ణానాం దుఃఖనాశనం

ఇహలోకే పరత్రాపి - ముక్తిర్భవతి నిశ్చితం ||

ఉదయం మేల్కొంటూనే, ఇప్పుడు చెప్పుకున్న 12 జ్యోతిర్లింగాలను స్తోత్ర రూపాన గాని - నామరూపాన గాని భక్తితో తలచుకొనువారలు పాపాల నుండి విముక్తులవుతారు. ఎవరెవరు ఏ యే కోరికలతో ఇది పఠిస్తారో వారికాయా కోరికలు తప్పక సిద్ధిస్తాయి. ఇక - ఆ జ్యోతిర్లింగాల దర్శనం, పూజ సిద్ధించిన వారికి ఇహలోకంలో సమస్తసంపదలు కలిగి, పరమునందు ముక్తి తథ్యం!